
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజి
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస
అమ్మ శారదా దేవి
గురు వివేకానంద
గురు సాయిబాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళ స్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

గీతా దీక్ష వారి వెబ్ సైట్:

http://www.geetadeeksha.com



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఒజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



# జ్ఞానదేవ్ జ్ఞానబోధ

## అభంగములు

(మరాఠీ మాతృకకు
తెలుగు పద్య తాత్పర్యములు)

రచన :
అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు
M.Tech



# సతీ సమేత అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు


Address :

Flat No.5; Plot 61,

Siddardha Apartments,

Siddardha Nagar,

Hyderabad - 500 038, A.P, India

E-Mail : deekshitulu_a@yhaoo.com

Mobile : 9393021360

Website: http://www.geetadeeksha.com/

శుభమస్తు ఓం అవిఘ్నమస్తు

# జ్ఞానదేవ్ జ్ఞానబోధ

## అభంగములు

(మరాఠీ మాతృకకు
తెలుగు పద్య తాత్పర్యములు)

రచన :
**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
M.Tech



## ప్రార్థన

కం॥ శ్రీ రమణి తాను పట్టిన
నీ రమ్యపదంబు తాక నిను గీర్తింతున్
నేరాలు యెంచనేలర
నారాయణ! తండ్రి! నీవె నాగతి నీవే.

తే॥ స్వామి సుందర చైతన్య సద్గురువులు
దీని జెప్పిరి సరళమౌ తెనుగులోన
చదివి దానిని పులకించి సాధులార!
పద్య కవితగ నేజెప్ప వారి కృపయె

ఆవె॥ భాష యేది అయిన ప్రాంతంబదేమైన
ఎవరు చెప్పిగాని హితవు మేలె
తెలియనట్టి దైన దేనిని వదలను
దీక్షబట్టినాడ దెలియ, దెలుప.



చం॥ తెలియదు భాష నాకు ఇది తెల్సిన వారలు
తెల్వరొక్కరున్
పలికి 'మరాఠి' దెల్పుటకు బందుగుడొక్కడు
లేడు ఈకృతిన్
దెలిపిన 'సుందరుండు' గురుదేవులు జెప్పిరి
భావవాహినీ
సలిల తరంగమట్లు ఇక చక్కని పద్యము
జెప్పుటెట్టులో!

ఆవె॥ వంటరాని ఆలు వడ్డించ గోముగా
ఉడకకున్నగాని ఉలుకు లేక
మగడు దినిన రీతి మన్నించి రుచిజూడ
దీని జదువరయ్య మనవి వినుచు



ఉ॥ గాంచితి స్వప్నమున్ 'విభుడు' కన్నుల ముందర
దోచి రమ్మనెన్,
మించిన సంతసంబలర మిత్రుల బిల్చితి పల్క
డెవ్వడున్,
మంచది, నేనె బోదునని మాధవు ముందర
జేరబోతి, నీ
వెంచవు నన్ను నీ గతిగ ఎందుకు నేనని మాయ
మయ్యెరా.

ఆవె॥ కామ, క్రోధ, మోహ, కాపీనములగూడి
మదము, మచ్చరములు మనని బట్టి
మంటగలుపుచుండె, మాధవుడే దిక్కు
శరణమందరేల? జగతి జనులు.

ఉ॥ మత్తులు దుర్మదాంధులును మాధవు నొల్లని
వృద్ధులందరున్
చత్తురు పుట్టి పృథ్వి పయి జన్మల క్రుంగుచు
నుందు రక్కటా!
ఎత్తరి కానలందు పులి ఇంపుగ మ్రింగును
స్వంత కూనలన్
అత్తరి నాదు పుణ్యముల నన్నిటి మ్రింగితి
నేను శ్రీహరీ!

కం॥ పలుకులు ములుకులు, తెలియక
కలకలములు సలిపి నలుపు, ఖలులకు బలముల్
మిలమిల వెలిగెడి కనులతొ
నిలిచిన శ్రీనిలయు కొలుతు నిలువగ నాలో.



సీ॥ ధరణీధవుని మాని ధనము వాంఛించెడి
తులువను దరిజేర్చు ద్రోహియెవడు?
వనమాలి వద్దని పైడి వస్తువులన్ని
ప్రోవు జేసెడి కూళు బ్రోచునెవడు?
వాణి మామను వీడి వాహనంబుల గోరు
వాచాలు గైకొను వాడెవండు?
దామోదరుని గాక తరుణులన్ దగిలెడి
పతితుని తోడుండు బంధువెవడు?

తే॥ విఠలనాధుని వీడిన భిక్షరాదు
శ్యామసుందరు డొద్దన్న సాయమెవడు?
నలువ తండ్రిని కాదన్న నాశనంబె
శౌరిదలవరు అంతిమ శ్వాస దాక.



ఆ॥ హరిని మరచి, వైరి హరునకు హరియని
హరిని అరయలేరు ధరణి నరులు
హరిని హరుని సరిగ ఎరుగరు మరతురు
హరియె హరుడు కరిగి మొరల నెరుగు.

మ॥ హరి శ్రీ విఠ్ఠల పాండురంగ విభునిన్ ఆనాడు
సద్భక్తులున్
అరయన్ జేసిరి డెందమందు, అటుపై
అవ్యాజమౌ ప్రేమతో
సరియౌ మార్గము జూపమానవులకున్
సద్బుద్ధినందించ తాన్
సురుచిన్ జెప్పెనభంగ మాల మకర జ్యోతాయె
జ్ఞానేశుడున్



# ఉపోద్ఘాతం

## హరినామం సరిలేని ధామం

**"సంగీత జ్ఞానము-భక్తి వినా సన్మార్గము కలదే మనసా!".... అని చక్కగా నొక్కి వక్కాణించాడు. శ్రీరామ నామోపాసకుడు, వాగ్గేయ కారుడు మూర్తీభవించిన భక్తియోగం, మన త్యాగయ్య!**

**మన భారతదేశం భక్తి, కర్మ, జ్ఞాన, వైరాగ్య యోగ సాధకులతో వేల సంవత్సరాల నుండి పునీతమై ఆ సత్సాంప్రదాయ బలంతో, చరిత్రలో అనేక ఆటుపోట్లను తట్టుకుని ఈరోజు ప్రపంచ దేశాలలో తన ఉనికిని అనేక విద్య వైజ్ఞానిక రంగాలలో స్పష్టంగా ఉన్నతంగా చాటుకోవటం మనం చూస్తున్న ప్రగతిదారుల్లో ఈరోజు మనం వేగంగా ముందుకు పోవటానికి పునాది, మన సనాతన సంస్కృతీ సాంప్రదాయల స్ఫూర్తియేనని మన విజ్ఞులు భావిస్తున్నారు.**

భక్తి ఉద్యమం తీవ్రంగా సాగుతున్న రెండవ సహస్రంలో, అనేకమంది మహాపురుషులు పుణ్య చరితులు, భాగవోత్తములు తమతమ జీవితాలలో భక్తి భావాలు నింపుకుని ప్రజలను కూడా నామజపం, భజన సాధన పద్ధతులతో చైతన్యపరచి ధైర్యపరచి పరమాత్మవైపు నడిపారు, తరించారు. అట్టి పరమ భాగవతోత్తములలో 13వ శతాబ్ది యందు మహారాష్ట్ర దేశంలో భక్తి ఉద్యమానికి అంకురార్పణ చేసిన మూల పురుషుడు సంత్ శిరోమణి జ్ఞానదేవ్, భక్తాగ్రేసరులైన తుకారాం, నామదేవ్, ముక్తాభాయి, ఏకనాథ్‌లాంటి భక్త శిరోమణులకు స్ఫూర్తినిచ్చిన మార్గదర్శి జ్ఞానదేవ్.

భక్తిభావం మనిషిని పవిత్రం చేస్తుంది. 'అన్నీ తెలిసినవే' అనుకునే 'జ్ఞాని' కయినా నిత్యసత్కర్మలతో నిరంతరం మునిగిపోయే కర్మిష్ఠికయినా ఎక్కడో జనులకు దూరంగా కొండల్లోనో, కోనల్లోనో అడవుల్లోనో ధ్యానం చేసుకునే 'యోగి' కయినా, ఎటువంటి ఆస్తికుని కయినా మొదట పరమాత్మను తెలుసుకోవటానికి



అనుభవంలోకి తెచ్చుకుని ఆనందించటానికి, తీపి వస్తువులలో చక్కెరలాగ 'భక్తి' భావం ఉండి తీరవలసిందే. అందుకే మహాజ్ఞాని అయిన ఆది శంకరులు భక్తితో ఎన్నో స్తోత్రాలు చెప్పి భక్తి తత్వరలో తన్మయులయ్యారు. ఈ ఉదాత్త భావం లేనివాడు పండితుడయినా వేదాంతి అయినా నిష్ఫలం.

అపర భక్త శిరోమణి జ్ఞానదేవ్ పట్టుమని ఇరువది సంవత్సరములు గూడ దాటని చిరు యవ్వన దశలోనే ముజ్జగములలోని జ్ఞాన సర్వస్వాన్ని ఔపోసన పట్టిన అగస్త్యుడు. "జ్ఞానేశ్వర్ అనుభవామృతము" మొదలగు రచనల ద్వారా, భక్త జనసందోహాన్ని ఉద్రూతలూగించిన అభినవ వ్యాసుడు! యోగప్రదీపమై 'గోడను' నడిపించిన, 'గొడ్డు' నుండి వేదము పలికించిన పరమయోగి సత్తముడు. రెండు పదులు నిండకనే 'రెండూ మిథ్య' యని నిర్ణయించి బుద్ధిని సమం చేసి, 'ఇంద్రియాణి' నదీతీరంలో అసంఖ్యాక భక్తజన సమక్షంలో జీవసమాధియైన చిరంజీవి.



శ్రీసుందర చైతన్యానంద స్వామివారి జ్ఞానదేవ్ అభంగముల నుంచి జ్ఞానదేవుడు పదే పదే బోధించేది ఆ హరిని నిరంతరం తలవమని, ఆ తలంపులో తరించమని, తరించి సుఖించమని, హరినామ స్మరణలో చిత్తశుద్ధి కలిగి ఆ పరమాత్మ సన్నిధిలో మనం పరమానందం పొందుతాం అని. అయితే కావలసింది ముఖ్యంగా 'భక్తి'. వాచా భక్తికాదు 'నిజభక్తి'. కల్మషం లేని నిష్కామ 'భక్తి'. "నీవే నేను, నేనే నీవు ఓ దయానిధీ! నీ సామీప్యం అనుగ్రహించు. నీ సాన్నిధ్యంలోకి తీసుకో. నీసాయుజ్యం చేసుకో. ఇది తప్ప నాకింకేమీ వద్దు" అని ప్రహ్లాదునివలె ఆర్తితో తపించాలి, గజేంద్రునివలె 'నీవే తప్ప ఇతఃపరంబెరుగ కావవే వరదా!'...... అని హృదయంలో నిరంతరం ప్రార్థన చేయాలి. ఇదీ ఈ అభంగాల సారాంశం.

'యజ్ఞానాం జప యజ్ఞోస్మి'...... అంటే యజ్ఞములలో 'జప' యజ్ఞమును నేనే! అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత 'విభూతి యోగం' లో స్పష్టంగా ప్రకటించాడు. దీనిని



బట్టి గూడా తన స్వరూపమే అయినదీ, ఎంతో సులభమైనదీ, ఖర్చులేనిదీ అయిన 'నామ జపాన్ని' పవిత్ర హృదయంతో, ఆచరించి అనన్యభక్తితో సాధన చేస్తే, ఆత్మ జ్ఞానమూ, భగవత్సాక్షాత్కారమూ, తత్ఫలితంగా మోక్షమూ తప్పక లభించుటకు ఆస్కారముంటుందని స్పష్టం చేయబడింది. ఇటువంటి జ్ఞానదేవుని అభంగముల సారాంశం వంటబట్టించుకుని ముముక్షువులు నిరంతరం హృదయంలో స్థిరంగా నిలుపుకుని 'నామోపాసకులు' కాగలరని ఆశిస్తున్నాను.

'హరిపాఠ్' అనే పేరుతో జ్ఞానదేవ్ 27 అభంగములతో శ్రీహరిని కీర్తించారు. దానికి శ్రీస్వామిసుందర చైతన్యానంద అద్భుతమైన వ్యాఖ్యానం వ్రాశారు. అది చదివి నా సత్సంగ సహచరులు అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులుగారు భక్తితో పరవశించి పద్యరూపంగా వ్రాసి తాత్పర్యం జతకూర్చడం ఎంతో ముదావహం. శ్రీదీక్షితులుగారు చదివింది ఉన్నత సాంకేతిక విద్య అయినా వృత్తిరీత్యా

(పూర్వాశ్రమంలో) పారిశ్రామికవేత్త అయినా, ప్రవృత్తి రీత్యా భగవద్భక్తుడు, కవి, పరిశీలకుడు, తెలిసింది తెలిసినట్లుగా సూటిగా చెప్పగలిగే 'నిష్కల్మషి'. అనేక సాధనావిధానాలను వాటి అంతర్భావాలనూ తెలుసుకోవాలని తపించే నిత్యాన్వేషి. తన భావ పరంపరలను హృద్యంగా పద్యీకరించి, దేవ దేవునికి నైవేద్యం చేసే కవితా పూజారి. నిత్య సాధకుడు. కవితా వ్యవసాయకుడు. ఏ సద్గ్రంధం వినినా అందులోని భావ గాంభీర్యాన్ని గ్రహించి, శీలించి తన స్పందనలను సహృదయంతో అక్షరరూపంలో సాక్షాత్కరించుకునే ఆత్మ సాక్షి! శరీరం సహకరించకపోయినా ఎంతో శ్రమ తీసుకుని, శ్రద్ధతో, ఆర్తితో అనుకున్నది సాధించే దాకా వదలని పట్టుదల, అన్నిటినీ మించి నిండైన మనస్సుతో మెండైన భక్తితో ఆ అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుని కొండంత అండతో పద్యీకరించటానికి ఉద్యమించటం ఎంతో హర్షణీయం, ప్రోత్సాహదాయకం. ఇదీ ఆయనలో నాకు కనిపించిన ప్రత్యేకత.



నాపట్ల ఉన్న అభిమానంతో శ్రీ దీక్షితులుగారు ఈ రచనకు ఉపోద్ఘాతం వ్రాయమని కోరటంవల్ల నాకున్న కొద్ది జ్ఞానంతో నాకు తోచిన నాలుగు మాటలు వ్రాసే అవకాశం కలిగింది. ఇందుకు వారికి కృతజ్ఞతాభివందనములు తెలుపుకుంటూ వారు యింకా యిలాంటి సద్గ్రంధాలను యిదేరీతిలో రచిస్తూ భగవత్సేవా, భాగవతుల సేవా పథంలో పురోగమిస్తూ, వారికి ఈ క్రమంలో ఆ దేవదేవుడు యింకా స్ఫూర్తినీ శక్తినీ ఉత్సాహాన్నీ అనుగ్రహించాలని వేడుకుంటున్నాను.

బుధజనవిధేయుడు

15-08-2007 యం.వి.యల్.యన్.మూర్తి

హైద్రాబాద్.



## అంకితము

మ॥ కఠినంబైనది విష్ణు దీక్ష కలుగున్
కష్టంబులున్ నష్టముల్
పఠనంబైన 'మరాఠి' రాదు, ఇకనే
పద్యంబు వ్రాసేదెలా?
'జఠరాగ్ని'య్యది కాల్చుచుండ ఒకచో
'చైతన్య' ప్రాప్తయ్యెరా
విఠలున్ గొల్చుచు అంకితమ్మునిడినే
వేనోళ్ళ గీర్తించెదన్



## జ్ఞానదేవ్ జ్ఞానబోధ

### అభంగ్ - 1

దేవాచియే ద్వారీఁఉభా క్షణభరీ।
తేణేఁముక్తిచారీ సాధియేల్యా॥

హరిముఖేఁమ్హణా హరి ముఖేఁమ్హణా।
పుణ్యాచీ గణనా కోణ్ కరీ॥

అసోని సంసారీఁజివ్హే వేగు కరీ।
వేదశాస్త్ర ఉభారీ బాహ్యా సదా॥

జ్ఞానదేవ మ్హణే వ్యాసాచియే ఖుణేఁ।
ద్వారకేచే రాణే పాండవాఁ ఘరీఁ॥

సీ॥ దైవ సన్నిధియందు నలరిన క్షణమైన
1 నాలుగు విధముల కలుగు ముక్తి
హరి! హరి! యని నేడు అనరయ్య పలుమార్లు
గణనకందని పుణ్య గరిమ కలుగ

సంసార బంధాలు సాధనచే ద్రెంప
వేద శాస్త్రమెపుడు వెలికి జెప్పె
ద్వారకాపతి కాచె తను పాండు తనయుల
వ్యాసప్రోక్తంబుగా వాసికెక్కె

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరయ్య
చవులు ఊర నేడు జ్ఞానమెరుగ
తానభంగములను ధన్యుడై జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయ జేసె.

తా॥ పరమాత్మ సన్నిధానంలో ఒక్క క్షణం గడిపినా చతుర్విధ ముక్తి తప్పక కలుగును. నేడు హరినామస్మరణం పలుమార్లుజేసి, లెక్కింప సాధ్యంగాని పుణ్యవైభవం ఏల పొందరు? సాధన జేత సంసారబంధ విముక్తులవుట సాధ్యమని వేదశాస్త్రములు చక్కగా బోధించినవి ద్వారకానగరాధిపతియైన ఆ శ్రీకృష్ణుడు, తనకు ప్రీతిపాత్రులైన పాండునందనులను రక్షించగా



వ్యాసమహామునిచే కావ్యంగా చెప్పబడింది. ఓ ప్రజలారా! జ్ఞానదేవుని ఈ దివ్య బోధను రసాస్వాదన జేయుచూ జ్ఞానము నెరుగుడు. ఆయన అభంగములలో తను ధన్యుడై జెప్పెను. విఠలదేవుని కీర్తిని ఇనుమడింప జేసెను.

## అభంగ్ - ౨

**చహూం వేదీం జాణ్‌సాహి శాస్త్రీం కారణ్ ।**
**అఠరాహి పురాణేం హరిసీ గాతీ ॥**

**మంథునీ నవనీతా తైసేంఘే అనంతా।**
**వాయాంవ్యర్థ్ కథా సాండీ మార్గు ॥**

**ఏక్ హరీ ఆత్మా జీవ శివసమా ।**
**వాయాంతూం దుర్గమా న ఘాలీం మన్ ॥**

**జ్ఞానదేవా పాఠ్ హరి హా వైకుంఠ్।**
**భరలా ఘనదాట్ హరి దిసే ॥**



సీ॥ వేదంబులున్ నాల్గు, విహిత శాస్త్రములారు,
౨ అన్ని పురాణాలు హరిని దెలిపె
వెన్న జిల్కన రీతి వెన్నుని ధ్యానించ
అన్యమేదైనను అనవసరము
హరియొక్కడే, జీవు నాత్మయు ఈశుడున్
గతులు వేరైనను గమ్యమొకటె
వాని సంకీర్తనే వైకుంఠ మార్గంబు
విజ్ఞాన జ్ఞానముల్ విష్ణు కృపయె.

ఆ॥ జ్ఞానదేవ బోధ జనులార! వినరయ్య
చవులు ఊర నేడు జ్ఞానమెరుగ
తానభంగములను ధన్యుడై జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయ జేయ.



తా॥ నాలుగు వేదములు, ఆరు శాస్త్రములు, పదునెనిమిది పురాణములు శ్రీహరివైభవాన్నే తెలుపుతున్నాయి. ఇతరమేదైనా అవసరం లేదు అని భావించి, బాగుగా చిలికి (పెరుగును) వెన్నను సంపాదించినట్లే వెన్నుడైన ఆ శ్రీకృష్ణుని ధ్యానించి పొందవలెను. హరిఒక్కడే. జీవాత్మ ఈశ్వరుడు కూడ ఆయనే. హరిని ఆరాధించే పద్ధతులు వేరయినా చేరుకోవలసిన గమ్యం మాత్రం ఒక్కటే, ఆ శ్రీహరియే. ఆయన స్థానమైన వైకుంఠం చేరేదారి ఆయన సంకీర్తన. జ్ఞానము, విజ్ఞానములు కూడ ఆ పరమాత్మ కృపవల్ల మాత్రమే లభిస్తాయి. ఓ ప్రజలారా! జ్ఞానదేవుని ఈ దివ్య బోధను రసాస్వాదన జేయుచూ జ్ఞానము నెరుగుడు. ధన్యుడై ఆయన అభంగములలో ఆ విఠల దేవుని కీ ర్తిని ఇనుమడింప జేసెను.

## అభంగ్ - 3

**త్రిగుణ అసార్ నిర్గుణ హేఁసార్।**
**సారాసార్ విచార్ హరి పాఠ్॥**

**సగుణ నిర్గుణ గుణాచేఁ అగుణ్।**
**హరి వీణ మన్ వ్యర్థ్ జాయ్॥**

**అవ్యక్త్ నిరాకార్ నాహీఁ త్యా ఆకార్।**
**జేథోని చరాచర హరిసీ భజే॥**

**జ్ఞానదేవా ధ్యానీఁ రామకృష్ణ మనీఁ।**
**అనంత్ జన్మోనీ పుణ్యహూయ్॥**

సీ॥ సారహీనంబులు యెరిగినన్, త్రిగుణాలు
3 నిర్గుణంబే సార నిధి దెలియగ

గుణహీనమేదియో గుణగణ్యమేదియో
హరి జ్ఞానమొక్కటె యెరుగ దెలుపు



గుణనిర్గుణంబుల గుణముల గణనేల?
హరిలేని మనసుండి వ్యర్థమగును

ఆకార రహితుడు, అవ్యక్తుడున్, చరా
చరసృష్టి కర్తయు హరియె, నిజము.

తే॥ జ్ఞానదేవుడు జపియించె జ్ఞానగరిమ
రామ కృష్ణుల, జన్మజన్మముల పుణ్య
ఫలమనంతంబుగా దాను ప్రాప్తినొంద
యీ అభంగంబులన్ జెప్పెనివ్విధమున.

తా॥ సత్వ, రజో, తమో గుణములను ఈ మూడు గుణములు సారము లేనివి. ఒక్క నిర్గుణము మాత్రమే సారవంతమైనదని మనస్సుకి అర్థమవుతుంది. హరియొక్క జ్ఞానము మాత్రమే ఏది గుణవంతమైనదో ఏది గుణహీనమైనదో తెలియునట్లు జెప్పును. గుణ నిర్గుణములలో ఏది గుణమైనదో ఏది కాదో ఆ వితర్కం అనవసరం.



హరి నివాసం కాని మనస్సు వ్యర్థం కదా! నిరాకారుడూ, అవ్యక్తుడూ, ఈ చరాచర సృష్టికి కర్త ఆ శ్రీహరియే అనుమాట నిజము. జ్ఞానదేవుడు తన జ్ఞాన విశిష్ఠత చేత జన్మజన్మలలో చేసిన పుణ్యఫలము అనంతమై, రామ కృష్ణులను ఈ అభంగములతో ఈ విధంగా కీర్తించి భజించెను.

## అభంగ్ - 4

**భావేఁవీణ భక్తి భక్తీవీణ ముక్తి।**
**బళేఁ వీణ శక్తి బోలూఁ నయే॥**

**కై సేని దైవత్ ప్రసన్న వరీత్।**
**ఉగా రాహే నివాంత్ శినసీ వాయాఁ॥**

**సాయాస్ కరీసీ ప్రపంచ్ దిన నిశీఁ।**
**హరిసీ న భజసీ కోణ్యా గుణే॥**

**జ్ఞానదేవ మ్హణే హరిజప కరణేఁ।**
**తుటేల్ ధరణేఁ ప్రపంచాచేఁ॥**



సీ॥ భావరహిత భక్తి, భక్తిరహిత ముక్తి,
4 శక్తిరహిత ఉక్తి, సారరహిత

సూక్తి, నిష్ఫలములు, జూపవు పరమాత్మ
హరిచింత యొక్కటే పరమసుఖము

పగలు రాత్రులుకూడ బాధలు శ్రమలాయె
గుణహీనమైపోయె కోర్కెలెల్ల

భవబంధరహితమై పాపముక్తియు గల్గు
అచ్యుతున్ స్తుతియించ నదియె మేలు

ఆ॥ జ్ఞానదేవ బోధ జనులార! వినరయ్య
చవులు ఊర నేడు జ్ఞానమెరుగ
తానభంగములను ధన్యుడై జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయ జేయ.

తా॥ భావ శూన్యమైన భక్తి, భక్తిశూన్యమైన ముక్తి, శక్తిలేనివాడి ఆజ్ఞ, సారరహితమైన బోధ నిరుపయోగమై పరమాత్మ నెరింగింపవు. హరినామ స్మరణకంటే పరమ సుఖమునిచ్చేది ఏముంది? రేయింబవళ్ళూ కష్టాలూ కన్నీళ్ళతో, కోరికలన్నీ గుణములేని వ్యర్థములే కదా. అచ్యుతుడైన శ్రీహరిని స్తుతించినచో భవబంధములను తొలగించి పాపవిముక్తులను అదే చేస్తుంది కదా. ఓ ప్రజలారా! జ్ఞానదేవుని ఈ దివ్యబోధను రసాస్వాదన జేయుచూ జ్ఞానము నెరుగుడు. ఆయన అభంగములతో ధన్యుడై ఈ విధంగా జెప్పి ఆ విఠలదేవుని కీర్తించెను.



## అభంగ్ - 5

**యోగ యాగ విధీ యేణే నవ్హే సిద్ధీ।**
**వాయాంచి ఉపాధీ దంభ్ ధర్మ్॥**

**భావేఁ వీణ దేవ నకళె నిస్సందేహా।**
**గురు వీణ్ అనుభవ కైసా కళే?॥**

**తపేఁవీణ్ దైవత్ దిధల్యా వీణ్ ప్రాప్త్।**
**గుజేఁవీణ్ హిత్ కోణ్ సాంగే?॥**

**జ్ఞానదేవ సాంగే దృష్టాంతాచీ మాత్।**
**సాధూంచె సంగతీఁ తరణోపాయ్॥**

సీ॥ యోగ, యాగపు విధుల్ ఒసగెడి 'డాబులు'
5 పనికి మాలిన నిధుల్ కనవు సిద్ధి
భావసిద్ధియులేక పరమాత్మ దొరకునా?
అమరునే గురువినా అనుభవమ్ము?



తపము లేక హరియు, దానహీన గ్రహణ
మును, ప్రేమలేకున్న మోక్షమెట్లు?
సాధు సాంగత్యమే చక్కని మార్గంబు
అనుభవ సారంబుయైన మాట

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల
చవులు ఊర నేడు జ్ఞానమెరుగ
తానభంగములను ధన్యుడై జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయ జేసె.

తా॥ యోగము, యాగములందున్న విధులన్నీ డాంభికమైనవి. పనికి మాలిన నిధులు మరియు ఏనాటికీ సిద్ధిని కలిగించవు. భావ సిద్ధి లేకుండ పరమాత్మ దర్శనమెట్లు సాధ్యము? గురుకృప లేక అనుభవప్రాప్తి అసంభవం కదా.



తపము లేక భగవంతుడు, దాతృత్వము లేనిచోట యాచన, ప్రేమ (కరుణ) లేక మోక్షము ఎట్లు ప్రాప్తి యగును? సాధువులతో సాంగత్యం లభించిన మోక్షమార్గము తేలికగా లభించును. ఈ మాట ఎంతో గొప్ప అనుభవసారం కదా. ఓ ప్రజలారా! జ్ఞానదేవుని దివ్యబోధ రసాస్వాదన జేయుచూ జ్ఞానము నెరుగుడు. ఆయన ధన్యుడై అభంగములను జెప్పి ఆ విఠలనాధుని కీర్తించెను.

## అభంగ్ - 6

**సాధుబోధ్ ఝూలా తో నురోనియాఁ ఠేలా।**
**ఠాయీఁచ్ మురాలా అనుభవ్॥**

**కాపురాచీ వాతీ ఉజళలీ జ్యోతీ।**
**ఠాయీఁచ్ సమాప్తీ ఝూలీ జైశి॥**

**మోక్షరేఖేఁ ఆలా భాగ్యేఁ వినటలా ।**
**సాధూఁచా అంకిలా హరిభక్త్ ॥**

**జ్ఞానదేవా గోడీ సంగతీ సజ్జనీఁ ।**
**హరిదిసే జనీఁ వనీఁ ఆత్మతత్త్వీ ॥**

సీ॥ గురుబోధలో తగు గురి కుదిరినవాడు
6 అనుభవ జ్ఞానంబు నరయ గలుగు

కర్పూరమే కాలి ఘనమైన జ్యోతియౌ
నిప్పే నివాళియై నింగినెగియు

మోక్షగామియొకండె ముదముగా భాగ్యంబు
గల సాధు, సద్భక్తి గలుగువాడు

సత్సంగ ప్రీతి, కేశవుని దర్శించినన్
ఆటవికుండైన నతడె ఘనుడు



ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల
చవులు ఊర నేడు జ్ఞానమెరుగ
తానభంగములను ధన్యుడై జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయ జేసె.

తా॥ గురుబోధలో గురి కుదిరిన వాడు మాత్రమే అనుభవ జ్ఞానం పొందగలుగుతాడు. కర్పూరాన్ని వెలిగిస్తే గొప్ప జ్యోతియై నివాళిగా ఆకాశంలో వెలుగుతుంది. మోక్షేచ్ఛగలవాడు మాత్రమే సద్భక్తి గలిగిన సాధువవుతాడు. సత్సంగమునందు ప్రీతిగలిగి శ్రీహరిని దర్శించినచో, ఆటవికుడైనా అతడే గొప్పవాడు. ఓ ప్రజలారా! జ్ఞానదేవుని దివ్యబోధ రసాస్వాదన జేయుచూ జ్ఞానము నెరుగుడు. ఆయన ధన్యుడై అభంగములను జెప్పి ఆ విఠలనాధుని కీర్తించెను.



## అభంగ్ - 7

**పర్వతా ప్రమాణేఁ పాతక్ కరణేఁ ।**
**వజ్రలేప్ హెూణేఁ అభక్తాఁసీ॥**

**నాహిఁజ్యాసీ భక్తితో పతిత్ అభక్త్ ।**
**హరిసీ న భజత్ దైవహత్ ॥**

**అనంత వాచాళ్ బరళతీ బరళ్ ।**
**త్యాకైసేని గోపాళ్ పావే హరి? ॥**

**జ్ఞానదేవా ప్రమాణ్ ఆత్మా హా నిధాన్ ।**
**సర్వాఁ ఘటీఁ పూర్ణ్ ఏక్ నాందే ॥**

సీ॥ పర్వతముల వంటి పాపాలు చేసినన్
7 వజ్రలేపనములై భక్తి జెరచు

భక్తి హీనుల కర్మ 'వదలని శాపమౌ'
సత్కర్మ స్థిరముగా చనును వెంట



వాచాలుడెరుగును వాగుడు మాత్రమే
గోపాలు సన్నిధి కొఱకు గాడు

అన్నిట నలరిన ఆత్మే 'నిధానము'
సర్వంబు నొకటిగా సలిపె నిలిపి

తే॥ జ్ఞానదేవుని పలుకులు జ్ఞాన నిధులు
ఎరుగనవి ప్రమాణములైన హితవులాయె
పాపముక్తుల గావించు వసుధ జనుల
ఈ అభంగంబులన్ జెప్పె నివ్విధముగ.

తా॥ పర్వత ప్రమాణములైన పాపములను చేసినచో అవి కఠినమైన వజ్రపు లేపనములై బాధించి భక్తిని నశింప చేయును. ఆ భక్తిహీనుల కర్మ శాపమువలె తగులుకుంటుంది. సత్కర్మ మాత్రం స్థిరంగా వెంట వస్తుంది (మరణించాక).

వదరుబోతు మాత్రం వాగుడు వదలుడు. అందుకని వాడు శ్రీకృష్ణపరమాత్మ సన్నిధియైన వైకుంఠానికి అనర్హుడు. అన్నింటిలోనూ నెలకొన్న ఆత్మ ఒక్కటే నిధానము. అందుచేత అన్నింటినీ ఒక్కటిగా చేసి ఉంచింది. జ్ఞానదేవుని ఈ పలుకులు జ్ఞాన నిధులు. అవి ప్రమాణములు. హితవచనములు. భూలోకవాసులను పాప రహితులను గావించు ఈ అభంగములను జ్ఞానదేవుడు ఈ విధముగా బోధించెను.

## అభంగ్ - 8

**సంతాంచే సంగతీ మనోమార్గ గతీ।**
**ఆకళావా శ్రీపతీ యేణేఁ పంథేఁ॥**

**రామకృష్ణ వాచా భావ హా జీవాచా।**
**ఆత్మా జో శివాచా రామజప్॥**



**ఏకతత్త్వ నామ్ సాధితీ సాధన్।**
**ద్వైతాచేఁబంధనన్ బాధిజే॥**

**నామామృత గోడీ వైష్ణవాఁ లాధలీ।**
**యోగియాఁ సాధలీ జీవనకళా॥**

**సత్వర ఉచ్చార్ ప్రహ్లాదీఁ బింబలా।**
**ఉద్ధవా లాధలా కృష్ణ దాతా॥**

**జ్ఞానదేవ మ్హణే నామ హేఁ సులభ్।**
**సర్వత్ర దుర్లభ్ విరళా జాణేఁ॥**

సీ॥ సాధు సాంగత్యమే సన్మార్గమౌగదా!
8 ఆకళించిన హరిన్ అదియె సుగతి
శంకరుండాత్మను జపియించె రాముగా
రామ కృష్ణ యనక రాదు ముక్తి



'ఏకతత్త్వపు' నామమే కల్గుసాధనన్
ద్వైతంబు బంధించు దెచ్చు, బాధ.
యోగుల్ తపించగా ఒనగూడు మహిమలన్,
భజియించి హరి బొందు వైష్ణవుండు
ప్రహ్లాదుడున్ బొందె పలుకుచు హరియని
ఉద్ధవున్ కృష్ణుండు ఉద్ధరించె

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల
చవులు ఊర నేడు జ్ఞానమెరుగ
తానభంగములను ధన్యుడై జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయ జేసె.

తా॥ సాధువులతో స్నేహజీవనమే సన్మార్గమవును కదా. హరిని అర్థం చేసికోగలిగితే అదే కదా సన్మార్గము. పరమశివుడు ఆత్మరూపునిగా శ్రీరామచంద్రుని



జపించాడు. శ్రీరామ కృష్ణ అని ప్రార్థించక జీవముక్తి కలుగదు. సాధనవల్ల ఏక తత్త్వపు నామము సిద్ధించును. ద్వైత భావన మనుష్యులను బంధించి బాధించును. యోగులు తపిస్తూ సాధించిన మహిమలను, వైష్ణవుడయిన వాడు కేవలం భక్తితో హరినామం జపించి పొందగలుగును. హరినామం జపించి ప్రహ్లాదుడు విష్ణువుని పొందాడు. ఉద్ధవుని శ్రీకృష్ణుడు ఉద్ధరించి కరుణించాడు. ఓ జనులారా! జ్ఞానదేవుని దివ్యబోధ రసాస్వాదన జేయుచూ జ్ఞానము నెరుగుడు. ఆయన ధన్యుడై అభంములను జెప్పి ఆ విఠలనాధుని కీర్తించెను.

## అభంగ్ - 9

**విష్ణువీణ్ జప్ వ్యర్థ్ త్యాచేఁ జ్ఞాన్।**
**రామకృష్ణీఁమన్ నాహీఁ జ్యాచే॥**

**ఉపజోని కరంటా నేణే అద్వైత వాటా।**
**రామకృష్ణీఁ పైఠా కైసేని హూాయ్?॥**

**ద్వైతా చీ ఝూడణీ గురువీణ జ్ఞాన్।**
**తయాకైచేఁ కీర్తన ఘడేల్ నామీఁ॥**

**జ్ఞానదేవ మ్హణే సగుణ హేఁ ధ్యాన్।**
**నామపాఠ మౌన్ ప్రపంచాచేఁ॥**

సీ॥ జ్ఞాన, తపములేల కనకున్న ముక్తిని

9 రామ కృష్ణులు లేక రాదు ముక్తి

అద్వైత మెరుగరు అజ్ఞాన భావనన్

రామ కృష్ణులు లేక ఏమిటవును



గురు వినా జ్ఞానంబు కూడునా? ద్వైతియై

పుణ్యకీర్తన హరిన్ పొగడబోడు

మౌని ప్రపంచంబు మధువైరి నామంబు

సగుణ ధ్యానము జేత జ్ఞానులైరి

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల

చవులు ఊరనేడు జ్ఞానమెరుగ

తానభంగములను ధన్యుడై జెప్పెను

విఠలనాధుకీర్తి వెలయజేసె.

తా॥ జ్ఞానము, తపస్సు, ముక్తి కోరకుంటే వ్యర్థం. శ్రీరామ శ్రీకృష్ణుల అనుగ్రహం లేక ముక్తి లభించదు. అజ్ఞానంలో ఉన్నవారికి అద్వైతం తెలియదు. శ్రీరామ శ్రీకృష్ణుల కృపలేక ఏదీ జరుగదు. గురుకృప లేక జ్ఞానం సిద్ధించునా? ద్వైత భావనతో పావనమైన కీర్తనలు విసర్జించిన హరిని పొందలేరు. మౌనుల ప్రపంచమే



హరినామం. వారు సగుణ ధ్యానము చేత జ్ఞానులై ఆయనను సేవించారు. ఓ జనులారా! జ్ఞానదేవుని దివ్యబోధన రసాస్వాదన జేయుచు జ్ఞానము నెరుగుడు. ఆయన ధన్యుడై అభంగములను జెప్పి విఠలనాధుని కీర్తించెను.

## అభంగ్ - 10

**త్రివేణీఁ సంగమీఁ నానా తీర్థేఁ భ్రమీ।**
**చిత్త్‌నాహీఁ నామీఁ తరి తేఁవ్యర్థ్॥**

**నామాసీ విన్ముఖ్ తో నర్ పాపియా।**
**హరివీణ ధాఁవ్‌యా న పవే కోణీ॥**

**పురాణ ప్రసిద్ధ బోలిలే వాల్మీక్।**
**నామేఁతిన్హీ లోక్ ఉద్ధరతీ॥**

**జ్ఞానదేవ మ్హణే నామ జపా హరీచేఁ।**
**పరంపరా త్యాచే కుళ శుద్ధ్॥**



సీ॥ వేల తీర్థముల, త్రివేణి సంగమములన్

10 మునుగుట వ్యర్థంబు, మనసులేక

హరినామ విముఖుడౌ నరుడు పాపియె వాడు,

భువివాని తోడుండి బ్రోచునెవడు?

వాల్మీకి చెప్పిన వాసిగన్న పురాణ

మీ లోక జనులకు మేలు గూర్చె

హరిజప నిష్ఠులు దురితదూరులు, వారి

కులపరంపర హెచ్చి కలుగు ముక్తి

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల

చవులు ఊరనేడు జ్ఞానమెరుగ

తానభంగములను ధన్యుడై జెప్పెను

విఠలనాధుకీర్తి వెలయజేసె.

తా॥ వేలాది తీర్థములు, త్రివేణి సంగమములలో (శ్రీహరిపై నమ్మకము లేక) మునుగుట వ్యర్థం కదా! హరినామము విసర్జించిన నరుడు పాపియే కదా! వాడిచేయి పట్టి ఆదుకునే వాడెవడు? వాల్మీకి రచించిన రామాయణం లోకులకు మేలు చేసింది. హరిజప నిష్ఠ గరిష్టులు పావనులైనారు. వారి కుల పరంపర పెరిగి ముక్తి నొందినారు. ఓ జనులారా! జ్ఞానదేవుని దివ్యబోధనా రసాస్వాదన జేయుచూ జ్ఞానము నెరుగుడు. ఆయన ధన్యుడై అభంగములను జెప్పి విఠలదేవుని కీర్తించెను.

## అభంగ్ - 11

**హరి ఉచ్చారణీఁ అనంత్ పాపరాశీ।**
**జాతీల లయాసీ క్షణమాత్రేఁ॥**

**తృణ అగ్నిమేళే సమరస ఝూలేఁ।**
**తైసేఁ నామేఁ కేలేఁ జపతాఁ హరీ॥**



**హరి ఉచ్చారణ మంత్ర్ హా అగాధ్।**
**పళే భూతబాధా భేణేఁ తేథేఁ॥**

**జ్ఞానదేవ మ్హణే హరి మాఝూ సమర్థ్।**
**న కరవే అర్థ్ ఉపనిషదాఁ॥**

సీ॥ క్షణమైన హరినామ స్మరణ జేసిన చాలు
11 భస్మీపటల మౌను పాపరాశి
తృణము అగ్నిని బడి తృటిలోన బూదియౌ
హరి నామమూ రీతి అఘము గాల్చు
హరిమంత్ర పఠనం బనంతంబగాధమౌ
జీవరాశుల బాధ అవని ద్రెంచు
శ్రుతులు పఠించుట చేతనే శౌరిని
కనుగొన సాధ్యంబె! కాదు సుమ్మి



ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల
చవులు నూరనేడు జ్ఞానమెరుగ
తానభంగములను ధన్యుడై జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయజేసె.

తా॥ ఒక్క క్షణమాత్రమైన హరినామస్మరణ చేస్తే పాపరాశులన్నీ దగ్ధమై పోతాయి. అగ్నిలో గడ్డిపోచ బడితే క్షణంలో బూడిదై పోతుంది. అదే విధంగా హరినామస్మరణ కనుమూసి తెరిచేంతలో పాపముల నన్నింటిని కాల్చివేస్తుంది. హరినామమంత్రము అగాధమైనది, అనంతమైనది. ప్రపంచంలోని జీవరాశుల బాధల నన్నింటిని తెగటార్చగల శక్తివంతమైనది. ఆ పరమాత్మను ఉపనిషత్తుల జ్ఞానంతో కనుగొన సాధ్యమా? కాదు. సర్వ సమర్థుడు ఆ శ్రీహరి ఒక్కడే. ఓ జనులారా! జ్ఞానదేవుని దివ్యబోధనా రసాస్వాదన



జేయుచూ జ్ఞానము నెరుగుడు. ఆయన ధన్యుడై అభంగములను జెప్పి విఠలదేవుని కీర్తించెను.

## అభంగ్ - 12

**తీర్థ్ వ్రత్ నేమ్ భావేఁ వీణ్ సిద్ధి।**
**వాయాఁచి ఉపాధి కరిసీ జనా॥**

**భావబళేఁ ఆకళే యోఫ్రావీఁ నాకళే।**
**కరతళీఁ ఆవళే తైసా హరీ॥**

**పారియాచా రవా ఘేతాఁ భూమీవరీ।**
**యత్న పరోపరీ సాధన్ తైసేఁ॥**

**జ్ఞానదేవ మ్హణే నివృత్తి నిర్గుణ్।**
**దిధలేఁసంపూర్ణ్ మాఝే హాతీ॥**

సీ॥ తీర్థయాత్రలు, వ్రతదీక్షలు, నియమాలు
12 వ్యర్థంబు కద! లేక ఆత్మశుద్ధి

శుద్ధి నొందిన హృది, సిద్ధి సాధ్యంబౌను
కరతలామలకమౌ హరిపథంబు

పెక్కు సాధనలచే చిక్కునా శ్రీహరి
పాదరసంబెట్లు పట్టు వడును?

నిర్గుణుండౌ హరి నివృత్తి గలవాడు
పూర్తిగా యెందైన నున్నవాడు

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల
చవులు ఊరనేడు జ్ఞానమెరుగ
తానభంగములను ధన్యుడై జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయజేసె.



తా॥ సిద్ధి పొందనపుడు ఎన్ని తీర్థయాత్రలు, వ్రతదీక్షలు, నియమాలు అవలంభించినా ఏమి ఉపయోగం? పరిశుద్ధమైన హృదయం ఉంటేనే సిద్ధి కలుగుతుందనే మాట సత్యము. అప్పుడే వైకుంఠం సుసాధ్యమవుతుంది. కరతలామలకం అవుతుంది. పాదరసమును పట్టుకొనుట ఏ విధంగా కష్టమో ఎన్ని సాధనలు చేసినా శ్రీహరి లభ్యమవడం బహుదుష్కరం. నిర్గుణుడైన శ్రీహరి నివృత్తి కలిగినవాడు. ఎందైనా సంపూర్ణంగా ఉండేవాడు. ఓ జనులార! జ్ఞానదేవుని దివ్యబోధనా రసాస్వాదన జేయుచూ జ్ఞానము నెరుగుడు. ఆయన ధన్యుడై అభంగములను చెప్పి విఠలనాధుని కీర్తించెను.



## అభంగ్ - 13

**సమాధీ హరీచీ సమసుఖే వీణ్।**
**న సాధేల్ జాణ్ ద్వైత బుద్ధీ॥**

**బుద్ధీ చే వైభవ్ అన్య్ నాహీఁ దుజేఁ।**
**ఏకా కేశిరాజేఁ సకళ సిద్ధీ॥**

**బుద్ధి సిద్ధి నిధీ అవఘీచ్ ఉపాధీ।**
**జవ్ త్యా పరమానందీఁ మన్ నాహీఁ॥**

**జ్ఞానదేవీఁ రమ్య్ రమలేఁ సమాధాన్।**
**హరీ చేఁ చింతన్ సర్వకాళ్॥**

సీ॥ సర్వత్ర శ్రీహరిన్ సాధించి దర్శించ
13 ద్వైత భావంబులున్ అంతమౌను

అన్యంబు విడనాడ అదె మేలు బుద్ధికి
స్మరియించ హరియిచ్చు సర్వసిద్ధి



శ్రీహరి స్మృతిలేని సిద్ధుల నిధులన్ని
వ్యర్థ ఉపాధులు పనికిరావు

సర్వకాలంబులన్ సర్వేశు హరిచింత
తగు శ్రేష్ఠమౌ సమాధానమదియె

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల
చవులు ఊరనేడు జ్ఞానమెరుగ
తానభంగములను ధన్యుడై జెప్పెను
విఠలనాధుకీర్తి వెలయజేసె.

తా॥ 'ఇందుగలడందులేడని' అన్నట్లుగా శ్రీహరిని సాధించి దర్శించిన, మనకున్న ద్వైత భావనలన్నీ తొలగిపోవును. ఇతరములన్నీ విసర్జించి ఆ కేశవుని స్మరించిన సర్వమూ సిద్ధించును. అదే బుద్ధికి తగినది. శ్రీహరి ధ్యాసలేని సిద్ధులు నిరర్థకం. అవన్నీ పనికిరాని ఉపాధులు. అన్ని

సమయాలలోనూ సర్వేశ్వరుడైన హరి ఆలోచన తగినది, శ్రేష్ఠమైన సమాధానం అది. ఓ జనులారా! జ్ఞానదేవుని దివ్య బోధనా రసాస్వాదన జేయుచూ జ్ఞానము నెరుగుడు. ఆయన ధన్యుడై అభంగములను జెప్పి ఆ విఠలనాధుని కీర్తించెను.

## అభంగ్ - 14

**నిత్య సత్యమిత్ హరిపాఠ్ జ్యాసీ।**
**కళికాళ్ త్యాసీ న పాహే దృష్టీ॥**

**రామకృష్ణ ఉచ్చార్ అనంతరాశీ తప్**
**పాపాచే కళప్ పళతీ పుఢే॥**

**హరిహరి హరి హా మంత్ర్ శివాచా।**
**మ్హణ తీ జే వాచా తయాం మోక్ష్॥**

**జ్ఞానదేవా పాఠ్ నారాయణ నామ్।**
**పావిజే ఉత్తమ్ నిజస్థాన్॥**



సీ॥ హరిపైన దృష్టి, 'సంయమి' నిల్పు భక్తుండు
14 అందదు 'వెదకెడి యముని' కతడు

అంతమౌ పాపంబనంతమౌ పుణ్యంబు
రామ కృష్ణుల నామ రవము గ్రోల

హరుడే నుతించును హరిహరి హరియని
మురవైరి నామంబు మోక్షప్రదము

నారాయణుని నామ పారాయణము చేత
ఉత్తమ స్థానంబు నొందగలరు.

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల
చవులు ఊరనేడు జ్ఞానమెరుగ
తానభంగములను ధన్యుడై జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయజేసె.



తా॥ సంయమనము గలిగిన భక్తుడు తనదృష్టిని శ్రీహరిపై నుంచగానే మృత్యుపాశం పట్టుకుని వెదకుచున్న యమునికి అతడు దొరకడు. శ్రీరాముని, శ్రీకృష్ణుని నామముల ధ్వని విన్నంతనే పాపము నశించి అంతులేని పుణ్యం లభిస్తుంది. సాక్షాత్తు శంకరుడే రామ రామ అని రామనామం జపిస్తాడు. ఆ శ్రీహరినామం మోక్షప్రదము. ఆ నారాయణుని నామపారాయణ చేత ఉత్తమలోకాల ప్రాప్తి కలుగుతుంది. ఓ జనులారా! జ్ఞానదేవుని దివ్య బోధనా రసాస్వాదన జేయుచూ జ్ఞానము నెరుగుడు. ఆయన ధన్యుడై అభంగములను జెప్పి ఆ విఠలనాధుని కీర్తించెను.



## అభంగ్ - 15

**ఏక్ నామ్ హరీ ద్వైత నామ దురీ।**
**అద్వైత కుసరీ విరళా జాణే॥**

**సమబుద్ధి ఘేతాంసమాన్ శ్రీహరీ।**
**శమ దమావరీ హరీ ఝూలా॥**

**సర్వాంఘటీంరామ్ దేహాదేహీ ఏక్।**
**సూర్య ప్రకాశక్ సహస్రరశ్మీం॥**

**జ్ఞానదేవా చిత్తీ హరిపాఠ్ నేమా।**
**మాగిలియా జన్మాముక్త్ ఝూలోం॥**

సీ॥ హరినామ మొక్కటే పెరనామములు యేల?
15 అద్వైత మొక్కటే అవసరంబు

సమబుద్ధి గలవారు సములు శ్రీనాధుకున్
శమదమాదులు గెల్వ శౌరి దక్కు

దేహాల దేహియౌ దివ్యాత్మ రాముండు,
వేయి కిరణముల వెలుగు రవియు

జన్మజన్మలయందు జరుపు పాపము ద్రెంచు
హరినిల్చి చిత్తాన అమరియుండ

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల
చవులు ఊరనేడు జ్ఞానమెరుగ
తానభంగములను ధన్యుడై జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయజేసె.

తా॥ ఒక్క శ్రీహరి నామము తప్ప అన్యమైన ఏ నామమైనా అనవసరము. అద్వైతము ఒక్కటే అవసరము. అందరినీ, అన్నిటినీ సమానంగా చూడగలిగిన వారు ఆ శ్రీనాధునితో సమానమైన వారు. శమదమాదులను గెలిచిన, శ్రీహరి లభించును. దేహాలలో నున్న దేహియైన ఆత్మయే



రాముడు. వేయి కిరణాల వేలుపైన సూర్యభగవానుని వంటివాడు. ఆ శ్రీహరి, అంతరంగాలలో నెలకొని జన్మజన్మల చక్రబంధంలో నుంచి సంక్రమించే పాపాలను నిర్మూలించును. ఓ జనులారా! జ్ఞానదేవుని దివ్యబోధనా రసాస్వాదన చేత జ్ఞానము నెరుగుడు. ఆయన ధన్యుడై అభంగములను జెప్పి ఆ విఠలనాధుని కీర్తించెను.

## **అభంగ్ - 16**

**హరి బుద్ధీ జపే తో నర దుర్లభ్।**
**వాచేసి సులభ్ రామకృష్ణ్॥**

**రామకృష్ణ్ నామీఁ ఉన్మనీఁ సాధిలీ।**
**తయాసీ లాధలీ సకళ్ సిద్ధీ॥**



**సిద్ధీ బుద్ధీ ధర్మ్ హరిపాఠీఁ ఆలే।**
**ప్రపంచీ నివాలే సాధు సంగేఁ॥**

**జ్ఞానదేవీఁ నామ రామకృష్ణ రసా।**
**యెణేఁ దశదిశా ఆత్మారామ్॥**

సీ॥ రామ కృష్ణనుటయే లాభంబు సులభంబు
16 బుద్ధి దుర్లభ్యంబు పొంద హరిని

సర్వసిద్ధుల గెల్చు సజ్జనుండు జపించి
రామ కృష్ణుల కృపా రసము గ్రోలి

సిద్ధి, బుద్ధియు, ధర్మచింతన హరిదయే
సాధుసాంగత్యంబు జరుపు మేలు

ఆత్మరూపున రామునన్నింట కనుగొన్న
రామ కృష్ణుల రూపలబ్ధి కలుగు.



ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల
చవులు ఊర నేడు జ్ఞానమెరుగ
తానభంగములను ధన్యుడై జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయజేసె.

తా॥ అన్నిటి కన్నా సులభము లాభదాయకము శ్రీ రామ శ్రీకృష్ణ అని జపించుటయే. అయితే ఆ శ్రీహరినే కోరు భక్తి కలుగుట మాత్రం దుర్లభము. రామకృష్ణుల కృపారసపానము చేసిన సజ్జనుడు ఆ నామజపము చేత సర్వ సిద్ధులను సాధించును. కేవలం హరి దయ వలననే సిద్ధులూ, బుద్ధి, ధర్మ చింతన కలుగుతాయి. సాధుసాంగత్యం ఎప్పుడూ మేలు జేస్తుంది. అన్నిటిలోనూ ఆత్మారాముని రూపము కనుగొన్న రామ కృష్ణుల రూపప్రాప్తియూ కలుగును. ఓ జనులారా జ్ఞానదేవుని దివ్యబోధనా రసాస్వాదన చేత జ్ఞానము నెరుగుడు. ఆయన ధన్యుడై అభంగములను చెప్పి ఆ విఠలనాధుని కీర్తించెను.

## అభంగ్ - 17

**హరి పాఠ్ కీర్తి ముఖేఁ జరీ గాయ్ ।**
**పవిత్రచి హోయ్ దేహ త్యాచా ॥**

**తపాచే సామర్థ్యే తపిన్నలా అమూప్ ।**
**చిరంజీవ కల్ప్ వైకుంఠీ నాందే ॥**

**మాతృ పితృ భ్రాతా సగోత్ర్ అపార్ ।**
**చతుర్భుజ్ నర హోఊన్ ఠేలే ॥**

**జ్ఞాన గూఢగమ్య జ్ఞానదేవా లాధలేఁ ।**
**నివృత్తినేఁదిలేఁ మాఝ్యా హాతేఁ ॥**

సీ॥ హరినామ గానంబు జరుప సంకీర్తనై

17 దేహంబు శుద్ధియై తీర్చు బ్రతుకు

కల్పాంతమౌ దాక కలుగు వైకుంఠంబు

సామర్థ్యమున తపంబమలు జేయ



తల్లిదండ్రులు, సహోదరులు, సగోత్రులున్

హరి చతుర్భుజు గాంచ నమరు ముక్తి

పరమాత్మ నివృత్తి పరమమౌ దీవెన

గూఢమౌ జ్ఞానంబు, గురుతరంబు

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల

చవులు ఊరనేదు జ్ఞానమెరుగ

ఈ అభంగములను హితవుగా జెప్పెను

విఠలనాధు కీర్తి వెలయజేసె.

తా॥ హరినామ సంకీర్తనం చేస్తే, దేహము పవిత్రమై బ్రతుకు ధన్యం చేస్తుంది. సమర్ధతతో తపస్సు చేస్తే కల్పాంతము వరకు వైకుంఠం లభిస్తుంది. తల్లిదండ్రులు, సోదరులు, సగోత్రీకులు కూడ చతుర్భుజుడైన హరిని ప్రాప్తినొంది తరగని ముక్తికి పాత్రులవుతారు. దేవుదేవుని దివ్యమైన దీవెనలు



పొందుతారు. నిగూఢమైన జ్ఞాన ప్రాప్తిచే ఆనందం పొందుతారు. ఓ జనులారా! జ్ఞానదేవుని దివ్య బోధనా రసాస్వాదన చేత జ్ఞానము నెరుగుడు. ఆయన ధన్యుడై అభంగములను జెప్పి ఆ విఠలనాధుని కీర్తించెను.

## అభంగ్ - 18

**హరివంశ పురాణ్ హరినామ సంకీర్తన్ ।**
**హరివీణ సౌజన్స్ నేణే కాఁ హీఁ ॥**

**తయా నరా లాధలేఁ వైకుంఠ్ జోడలేఁ ।**
**సకళహీ ఘడలేఁ తీర్థాటన్ ॥**

**మనోమార్గేఁగేలా తో యేథేఁ ముకలా ।**
**హరిపాఠీఁ స్థిరావలా తోచి ధన్య్ ॥**

**జ్ఞానదేవా గోడీ హరి నామాచీ జోడీ ।**
**రామకృష్ణీఁ ఆవడీ సర్వకాళ్ ॥**



సీ॥ హరివంశ గాధలు హరినామ కీర్తనల్

18 హరిభక్త వరులకు అన్యమేల?

'వనమాలి' స్తోత్రంబు వైకుంఠమందించు

తీర్థయాత్రాఫల తృప్తి నిచ్చు

మనసు చెప్పిన త్రోవ మంటగలుపు జన్మ

హరిబాట వోయిన అమరు సుఖము

రామ కృష్ణులపైన అమరినన్ అభిరుచి

సర్వదా హరినామ జపము వెలయు

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల

చవులు నూరనేదు జ్ఞానమెరుగ

ఈ అభంగములను హితవుగా జెప్పెను

విఠలనాధుకీర్తి వెలయజేసె.

తా॥ హరివంశమునకు సంబంధించిన కథలు, హరినామ సంకీర్తనల కన్నా, ఇతరములైనవి సుజనులకు, హరిభక్తులకు అప్రియములు. వనమాలి పతియైన శ్రీహరిని కీర్తించిన వైకుంఠం లభించును. తీర్థయాత్రా పుణ్యము లభించును. చిత్తం వచ్చినట్లు పోతే బ్రతుకులు మంట గలిసిపోతాయి. హరినిర్ణయించిన త్రోవ (ధర్మమార్గం)లో పోయినచో గొప్ప సుఖం కలుగుతుంది. అభిరుచి రామ కృష్ణులపైన నిలిచి యుంటే ఎల్లప్పుడూ హరినామ సంకీర్తన జరుగు తుంటుంది. ఓ జనులార! జ్ఞానదేవుని దివ్య బోధనా రసాస్వాదనచేత జ్ఞానము నెరుగడు. ఆయన ధన్యుడై అభంగములను జెప్పి ఆ విఠలనాధుని కీర్తించెను.



## అభంగ్ - 19

**వేదశాస్త్ర ప్రమాణ్ శృతీచేఁ వచన్।**
**ఏక్ నారాయణ్ సార్ జప్॥**

**జప్ తప్ కర్మ్ హరి విణ ధర్మ్।**
**వా ఉగాచి శ్రమ వ్యర్థ జాయ్॥**

**హరిపాఠీఁ గేలేఁతే నివాంతచి రేలే।**
**భ్రమర గుంతలే సుమన్ కళికే॥**

**జ్ఞానదేవీఁ మంత్ర హరినామాచేఁ శస్త్ర।**
**యమేఁ కుళగోత్ర్ వర్జియలేఁ॥**

సీ॥ హరిజపంబొక్కటే దారియౌ ముక్తికి,
19 వేద ప్రమాణంబు నదియె దెలిపె
హరిలేని జపతపంబరయంగ వ్యర్థంబు
శ్రమదక్క కనలేవు శౌరినెపుడు



భ్రమరాలు గ్రోలును సుమనాల పూదేనె
భక్తుండు హరిధ్యాస బరవశించు
హరిమంత్ర శస్త్రంబు యముని నిరోధించు
భక్తుల దరిబోడు వదలివేయు

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల
చవులు ఊరనేడు జ్ఞానమెరుగ
ఈ అభంగములను హితవుగా జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయజేసె.

తా॥ ముక్తికి మార్గం ఆ శ్రీహరి నామజపం ఒక్కటే. వేదశాస్త్ర ప్రమాణ వచనం కూడ అదే తెలుపుతున్నది. ఈ ప్రపంచమంతా ఒక్కడే నారాయణుడున్నాడు. హరి విరహితమైన జపతపాదులు వ్యర్థము. శ్రమ మిగులుతుంది



కాని శ్రీహరిని దర్శింప నేరవు. తేనెటీగలు పూలతేనెను త్రాగినట్లు భక్తుడు హరి ఆలోచనలలోనే పరవశించును. హరినామం అనే గొప్ప శస్త్రం యమధర్మరాజునే అడ్డుకొనుట చేత ఆయన హరిభక్తుల వద్దకు పోనేపోడు.

ఓ జనులారా! జ్ఞానదేవుని దివ్యబోధనా రసాస్వాదన చేత జ్ఞానము నెరుగుడు. ఆయన ధన్యుడై అభంగములను చెప్పి విఠలనాధుని కీర్తించెను.

## అభంగ్ - 20

**నామ సంకీర్తన్ వైష్ణవాంచీ జోడీ।**
**పాపేఁ అనంత్ కోడీ గేలీఁ త్యాంచీ॥**

**అనంత్ జన్మాంచేఁ తప్ ఏక్ నామ్।**
**సర్వ మార్గ్ సుగమ్ హరిపాఠ్॥**

**యోగ యాగ క్రియా ధర్మాధర్మ్ మాయా।**
**గేలేతే విలయా హరిపాఠీ॥**

**జ్ఞానదేవీం యజ్ఞ్ యాగ్ క్రియా ధర్మ్।**
**హరివిణ నేమ్ నాహీం దుజా॥**

సీ॥ వైష్ణవుల మదిలో హరినామ కీర్తనల్
20 అఘముల కోటిని అణచి వేయు

ఒకసారి హరియన్న సకల జన్మల పాప
ములను, నిర్మూలించు ముక్తినీయు

సర్వ మార్గంబులు జరుపును సుగమంబు
విష్ణు సంకీర్తనా విధముచేత

ధర్మంబధర్మంబు తగుయోగ యాగముల్
'మాయ' యే హరియున్న మాయమౌను



తే॥ జ్ఞానదేవుని పలుకులు జ్ఞాన నిధులు,
యజ్ఞ, యోగ, ధర్మాచరణంబులేవి
నెరుగ నేరడు ఎరుగును హరి అనుటయె
ఈ అభంగమ్ములను జెప్పె నివ్విధమున

తా॥ విష్ణు భక్తుల మనస్సులలో వారు చేసే నామ సంకీర్తనలు వారిని పాపవిముక్తులను చేస్తున్నవి. ఒకసారి నామోచ్ఛరణ చేస్తే జన్మ జన్మల పాపాలు దూరం చేసి మోక్షప్రాప్తి నిస్తుంది. విష్ణునామ సంకీర్తన చేస్తే ముక్తిమార్గములన్నీ సుగమమవుతాయి. ధర్మాధర్మములు, యోగ యాగములు మొదలైనవన్నీ మాయా కల్పితాలు. హరినామ స్మరణతో ఇవన్నీ మాయమవుతాయి. జ్ఞానదేవుడు బోధనలు యజ్ఞ యోగ క్రియా, ధర్మములు మొదలైన వాటిని ఎరుగడు. ఆయన ఎరిగినది శ్రీహరీ అనుటయే. ఈ అభంగములను ఈ విధముగా చెప్పెను.



## అభంగ్ - 21

**కాళ్ వేళ్ నామ్ ఉచ్చారితాం నాహీం।**
**దోన్హీపక్ష్ పాహీ ఉద్ధరతీ॥**

**రామకృష్ణ నామ సర్వదోషాం హరణ్।**
**జడజీవాం తారణ్ హరి ఏక్॥**

**హరినామ సార్ జివ్హాయా నామాచీ।**
**ఉపమా త్యాద్రైవాచీ కోణ్ వానీ॥**

**జ్ఞానదేవా సాంగ్ ఝూలా హరిపాఠ్।**
**పూర్వజాం వైకుంఠ్ మార్గ్ సోపా॥**

సీ॥ కాలంపు వేళల గణనేల? ఏదేశ
22 మైన నేమి? హరియే మనసు నింద

రామ కృష్ణని పల్కు నామోచ్చారణమది
సర్వదోషహరణ జరిపితీరు



హరినామ మొక్కటే తారకమౌ కదా
జడ జీవములకెల్ల జగతియందు

వర్ణింప సాధ్యమా? వనమాలి సరివారి
హరినామ మహిమకున్ అంతులేదు

తే॥ జ్ఞానదేవుని పలుకులు జ్ఞాన నిధులు
హరిని స్మరియించె నాతండు అలుపు లేక
వారి పెద్దలు వైకుంఠ ప్రాప్తినొంద
ఈ అభంగమ్ములను జెప్పె నివ్విధమున.

తా॥ శ్రీహరి మనస్సులో స్థిరంగా ఉంటే, ఏదేశమైన ఏ సమయమైనా, ఏ రోజయినా ఏమాత్రం తేడా ఉండదు. రామ కృష్ణ అను ఆ నామోచ్చారణ అన్ని దోషములను నిర్మూలిస్తుంది. ఈ ప్రపంచంలోని జడజీవములనన్నింటినీ శ్రీహరినామమొక్కటే కాపాడుతుంది. వనమాలియైన కృష్ణునితో సమానమైన వారిని వర్ణించ సాధ్యమా? శ్రీహరి

మహిమలు లెక్కింప రానివి. జ్ఞానదేవుని పలుకులు జ్ఞాన నిధులు. ఆయన శ్రమ అని భావించక హరినామ సంకీర్తన చేసి వారి పెద్దలకు కూడ వైకుంఠ ప్రాప్తి కలుగునట్లు ఈ అభంగములను ఈ విధముగా చెప్పెను.

## అభంగ్ - 22

**నిత్యనేమ నామీం తే ప్రాణీ దుర్లభ్ ।**
**లక్ష్మీ వల్లభ్ తయా జవళీ ॥**

**నారాయణ హరి నారాయణ హరి ।**
**భుక్తి ముక్తి చారీ ఘరీం త్యాంచ్యా॥**

**హరి వీణ్ జన్మతో నర్కచిపై జాణా।**
**యమాచా పాహుణా ప్రాణీ హోయ్ ॥**

**జ్ఞానదేవ పుసే నివృత్తీసీ చాడ్ ।**
**గగనాహూని వాడ్ నామ ఆహే ॥**



సీ॥ లక్ష్మీపతియె యెదన్ లభ్యమౌ హరిపైన
22 మదియున్న, దుర్లభంబదియు కలుగ

'నారాయణా! హరీ!' నామమంత్రము జేత
భుక్తి లభించును ముక్తి దక్కు

'దండధరుని' విందు తప్పదు, ఒకసారి
హరివీడి బ్రతికిన నరకమగును

గగనంబు మించిన ఘనమైన నివృత్తి
గురుదేవు వివరంబు గూర్చి దెలిపె

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల
చవులు ఊరనేడు జ్ఞానమెరుగ
ఈ అభంగములను హితవుగా జెప్పెను
విఠలనాథు కీర్తి వెలయజేసె.



తా॥ శ్రీహరిపైన మనస్సు లగ్నం చేస్తే ఆయన దొరుకుతాడు. అది అంత తేలిక కాదు. మనందరికీ నారాయణుని నామమంత్రమే తిండి పెడుతున్నది. ఒక పర్యాయం హరిని విడిచి పెడితే నరకానికి పోయి ఆ యముని శిక్షలు తప్పవు. ఆకాశాన్ని మించిన నివృత్తి గురుదేవుల గొప్పతనం తెలుపుతుంది. ఓ జనులారా! జ్ఞానదేవుని దివ్య బోధనా రసాస్వాదన చేసి జ్ఞానము నెరుగుడు. ఆయన అభంగములను చెప్పి విఠలనాథుని కీర్తించెను.

## అభంగ్ - 23

**సాత్ పాంచ్ తీన్ దశకాంచా మేళా ।**
**ఏక తత్త్వీం కళా దావీ హరి ॥**

**తైసేంనవ్హేనామ్ సర్వత్ర వరిష్ఠ్ ।**
**యేథేం కాంహీ కష్ట్ న లగతీ ॥**



**అజపా జపణేం ఉలట్ ప్రాణాచా ।**
**తథేంహి మనాచా నిర్ధారు అసే ॥**

**జ్ఞానదేవా జిణేం నామేం వీణ వ్యర్థ్।**
**రామకృష్ణీంపంథ్ క్రమీయేలా ॥**

సీ॥ 'పాతిక' తత్త్వముల్ జతయౌట విభవమ్ము
23 అన్నిటికాధారమైన హరికి

ఏ సాధనముకన్న ఈ హరిస్మరణయే
శ్రేష్ఠంబు, లేదయ్య కష్టమేమి

అజప ధ్యానంబది ఆగని వాహిని
ఆ జపమును నమ్మి అరయ నగును

నామజపము లేని నరజన్మ వ్యర్థంబు
నామ సాధన మది సేమ కరము

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులార! వినరేల
చవులు ఊరనేడు జ్ఞానమెరుగ
ఈ అభంగములను హితవుగా జెప్పెను
విఠలనాథు కీర్తి వెలయజేసె.

తా॥ సర్వమునకు ఆధారమైన శ్రీహరికి ఇరువదియైదు తత్త్వములు గల వైభవమున్నది. ఏ సాధనకన్నా ఈ హరిస్మరణ తేలిక మరియు శ్రేష్ఠమైనది కూడ. ఏమీ కష్టం ఉండదు. అజపధ్యానము ఆగని ప్రవాహం వంటిది. దానిని నమ్మి మనస్సు లగ్నం చేయాలి. శ్రీహరినామం జపించని నరజన్మ నిరుపయోగం. ఆ నామసాధన చాల క్షేమ దాయకం.ఓ జనులారా! జ్ఞానదేవుని దివ్యబోధనా రసాస్వాదన జేసి జ్ఞానమునెరుగుడు. ఆయన అభంగములను జెప్పి విఠలనాథుని కీర్తించెను.



## అభంగ్ - 24

**జప తప కర్మ్ క్రియా నేమ ధర్మ్।**
**సర్వాంఘటీరామ్ భావ శుద్ధ్॥**

**న సోడీ రే భావో టాకీరే సందేహా।**
**రామకృష్ణీం టాహా నిత్య ఫోడీ॥**

**జాత్ విత్త్‌గోత్ కుళ్ శీళ్ మాత్।**
**భజే కాం త్వరిత్ భావనాయుక్త్॥**

**జ్ఞానదేవా ధ్యానీం రామకృష్ణ మనీం।**
**తేణేం వైకుంఠ భువనీం ఘర్ కేలేం॥**

సీ॥ ధర్మముల్, జప, కర్మ, తపములు యెన్నైన
24 భావ శుద్ధియె మిన్న భాసిలంగ
రాముండు ఆత్మలో, రామ కృష్ణని పాడి
ఎలుగెత్తి నామంబు పలుకరేల?



సందేహమే లేక సమభావనము కల్గు
కుల, జాతి, సిరియేల? గోత్రమేల?
మైమఱచును మది నామ సాధనజేత
పలుమార్లు హరి హరి భజనచేత

తే॥ జ్ఞానదేవుని పలుకులు జ్ఞాన నిధులు
రామకృష్ణుల నామముల్ రంజిలంగ
నిలిచె వైకుంఠమను హరి ఆలయమున
ఈ అభంగమ్ములను జెప్పె నివ్విధమున.

తా॥ జప, తప, కర్మలు, ధర్మములు ఎన్ని అయినా భావ నైర్మల్యం లేక ప్రకాశించవు. ఆత్మారామునిగానున్న రామ కృష్ణుల కీర్తిని గొంతెత్తిపాడి నామస్మరణ చేయరెందుకు? అట్లా చేస్తే నిస్సందేహంగా కుల, జాతి, గోత్ర ధనములతో కలిగే భేదాలు



అంతరించిపోతాయి. సమ భావన కలుగుతుంది. ఆ శ్రీహరినామమును సాధించిన మనస్సు ఎన్నోసార్లు హరి హరి అని నామస్మరణతో మైమరచిపోతుంది. జ్ఞానదేవుని మాటలు జ్ఞానపు మూటలు. రామ కృష్ణుల నామం సంతోషంగా పాడుతూ శ్రీహరి నిలయమైన వైకుంఠమున నివసించేటట్లు ఈ అభంగములను ఈ విధంగా చెప్పాడు.

## అభంగ్ - 25

**జాణీవ్ నేణీవ్ భగవంతీం నాహీం।**
**ఉచ్చారణీంపాహీంమోక్ష సదాం॥**

**నారాయణ హరి ఉచ్చార్ నామాచా।**
**తేథేం కళికాళాచా రీఘ్ నాహీం॥**

**తేథీల్ ప్రమాణ్ నేణవే వేదాసీ।**
**తేఁజీవ జంతూఁసీ కేవి కళే॥**

**జ్ఞానదేవా ఫళ్ నారాయణ పాఠ్।**
**సర్వత్ర్ వైకుంఠ్ కేలేఁ అసేఁ॥**

సీ॥ చీకటి వెలుగులు ఒకతీరు అచ్చోట
25 మురహరి అనుటయే ముక్తినీయు

నారాయణా యని నామంబు పలుకుటే
కాలుని రానీదు 'కలి'యు రాడు

జీవ జంతువులేవి చేరలేవా హరిన్
శ్రుతులు ప్రమాణముల్ చూపలేవు

సర్వత్ర వైకుంఠ సహజీవనము కల్గు
నారయణా యని హరిని బిలువ



ఆ॥ జ్ఞానదేవు బోధ జనులారా! వినరేల
చవులు ఊరనేడు జ్ఞానమెరుగ
ఈ అభంగములను హితవుగా జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయజేసె.

తా॥ మురారియైన ఆ శ్రీహరి నామస్మరణ చీకటి వెలుగులు (కష్ట సుఖాలు) ఒకేలా తోచే ఆ దివ్య ధామం అనే ముక్తినిస్తుంది. నారాయణుని నామపారాయణ కలిదోషహరణం. కాలుడని పిలువబడే యముని కూడా అడ్డుకోగల మహిమ కలది ఆ నామం. ఆ శ్రీహరిని ఏ జీవీ జంతువూ చేరలేవు. వేద ప్రమాణము లేవీ ఆ విష్ణుని చూపలేవు. అయితే నారాయణా అని ఆ హరిని మనసారా పిలిస్తే వైకుంఠ ప్రాప్తి కలిగి ఆ శ్రీహరితో నివసించే ధన్యత కలుగుతుంది.



ఓ జనులారా! జ్ఞానదేవుని దివ్యబోధనా రసాస్వాదన జేసి జ్ఞానము నెరుగుడు. ఆయన అభంగములను జెప్పి విఠలనాధుని కీర్తించెను.

## అభంగ్ - 26

**ఏక తత్త్వ నామ దృఢ ధరీ మనా।**
**హరీసీ కరుణా యేఈల్ తుఝీ॥**

**తేఁనామ్ సోపారేఁ రామకృష్ణ గోవింద్।**
**వాచేశీఁ సద్గద్ జపే ఆధీఁ॥**

**నామా పరతేఁ తత్త్వ్ నాహీఁరే అన్యథా।**
**వాయాఁ ఆణికా పంథా జాశీ ఝుణీ॥**

**జ్ఞానదేవా మౌన్ జపమాళ్ అంతరీ।**
**ధరోనీ శ్రీహరీఁ జపే సదా॥**



సీ॥ హరినామ తత్త్వంబు ధరియించ దృఢముగా
26 నెమ్మదిన్ కరుణయే నిండి నిలుచు

రామ కృష్ణాయను నామాల గోవిందు
ప్రేమగా పాడరే సేమమగును

స్మరణకు మించిన సాధన వేరేది?
హరిపథం మార్చిన హాని జరుగు

మదిలోన జపమాల, మానక నాల్కపై
హరినామ మెప్పుడు అవధరించి

ఆ॥ జ్ఞానదేవు బోధ జనులారా! వినరేల
చవులు ఊరనేడు జ్ఞానమెరుగ
ఈ అభంగములను హితవుగా జెప్పెను
విఠలనాధు కీర్తి వెలయజేసె.

తా॥ ధృఢంగా హరినామ తత్త్వం తెలుసుకుంటే మనస్సులో కారుణ్యం నిండి, స్థిరంగా ఉంటుంది. రామ కృష్ణ అనే నామాలతో గోవిందుడైన ఆ శ్రీహరిని ప్రేమగా నుతించిన క్షేమం తప్పక కలుగుతుంది. ఆ హరినామ స్మరణకు మించిన సాధన ఇంకొకటి యేదుంది? ఆ శ్రీహరి త్రోవ వదిలి పెడితే కీడు తప్పదు. మనస్సులో హరినామ జపం అనే మాలను ధరించి విడువకుండా నాలికపై ఆ విష్ణు సంకీర్తన నిలిచి ఉండాలి. ఓ జనులారా! జ్ఞానదేవుని దివ్య బోధనా రసాస్వాదన జేసి జ్ఞానము నెరుగుడు. ఆయన అభంగములను జెప్పి ఆ విఠలనాధుని కీర్తించెను.



## అభంగ్ - 27

సర్వసుఖ గోడీ సాహీ శాస్త్ర నివడీ।
రికామా అర్ధఘడీ రాహూఁనకో॥

లటికా వ్యవహార్ సర్వహా సంసార్।
వాయా యేర్ ఝూర్ హరీ వీణ్॥

నామ మంత్ర జప కోటీ జాఈల్ పాప్।
కృష్ణనామీఁ సంకల్ప్ ధరూని రాహే॥

నిజవృత్తి కాఢీ సర్వ మాయా తోడీ।
ఇంద్రియాఁ సవడీ లపోఁ నకో॥

తీర్థవ్రతీఁ భావ ధరీరే కరుణా।
శాంతి దయా పాహుఁణా హరి కరీ॥

జ్ఞానదేవా ప్రమాణ్ నివృత్తిదేవీఁ జ్ఞాన్।
సమాధి సంజీవన్ హరి పాఠ్॥



సీ॥ అన్ని శాస్త్రంబులు హరినామ కీర్తనల్
27 కాలము తెలియదు సలుప భజన
వీడిన హరిచింత 'ఏడుకట్ల సవారి'
సారహీనంబు సంసార మెల్ల
మాయయై మనుజుని మట్టుబెట్టుట కద్దు
నామమంత్రంబును నమ్మదగును
కోటి పాపంబుల గూల్చును, దీక్షగా
కృష్ణుని సాధించ కీర్తనలచె
మాయను యెదిరించి మాధవున్ భజియించ
అణుగు ఇంద్రియముల 'ఆట' లన్ని
వ్రతములు తీర్థముల్ మనసున శుద్ధికై
హరిరూపు నరయంగ కరుణ తెలియు

తే॥ జ్ఞానదేవు ప్రమాణము, ఆ 'నివృత్తి'
విష్ణు కీర్తనము, సమాధి, విహితమౌను
జ్ఞాన సంజీవనియును జీవన మణి, అది
విఠలు గొల్చెనభంగముల్ పేర్మిజెప్పి.



తా॥ శాస్త్రములన్నీ ఆ శ్రీహరి నామకీర్తనలే. ఆ శ్రీహరిని భజిస్తుంటే కాలము కూడ తెలియదు. హరిచింతమానినచో ఏడుకట్ల సవారి (మృత్యువు) తప్పదు. ఈ ప్రపంచమంతా తెలుసుకుంటే నిస్సారమైనదే. ఈ మాయ నరుని తప్పక నాశనం చేస్తుంది. కాబట్టి నామమంత్రమును నమ్ముట మంచిది. ఆ నామము కోటి పాపములను కూడా నిర్మూలించగల శక్తివంతము. కీర్తనలు పాడుచూ దీక్షగా శ్రీకృష్ణుని సాధించవచ్చును. ఈ మాయను విడనాడి మాధవుని భజించిన యెడల ఇంద్రియముల ఆటలన్నీ అణిగిపోవును. ఈ వ్రతదీక్షలు తీర్థయాత్రలూ అంతఃకరణ శుద్ధికై చేసే విధానములు. హరిస్వరూపం తెలియగానే కరుణ తెలుస్తుంది. జ్ఞానదేవుని ప్రమాణము వినుడు. విష్ణు కీర్తనము, నివృత్తి, సమాధి విహితమైనవి. అది జీవనమణి, జ్ఞాన సంజీవని. ఆయన హరిప్రేమతో అభంగములను జెప్పి విఠల నాధుని సేవించెను.

## అభంగముల ఐశ్వర్యం

భంగములు లేకుండ చెప్పేవి అభంగములు. అంటే ధారావాహికగా చెప్పే స్తోత్రములు. రెండు పాదములుండే ద్విపదలు నాలుగు ఉండే ఈ అభంగములను 13వ శతాబ్దివాడైన మహాభక్తుడు జ్ఞానదేవుడు చెప్పాడు. ఇతనినే జ్ఞానేశ్వర్ అనికూడా పిలుస్తారు. మహారాష్ట్ర దేశంలో భక్తి కవిత్వానికి అంకురార్పణ చేసిన ఈ జ్ఞాని విఠలనాథుని శ్రీహరిగా కీర్తించాడు.

ఈ అభంగాలలో బుద్బుదప్రాయమైన మానవ జీవితంలో శ్రీహరి చింతమాని ధనం కీర్తిలాంటి వ్యర్థమైన విషయాలపై అర్థంలేని మమకారం పెంచుకొని బ్రతుకును నిరర్థకం చేసుకునే వారికి భగవద్దత్తమైన నరజన్మను వ్యర్థం చేసుకునే వారికి కనువిప్పు కలిగించేవిగా ఉంటాయి.



సమ భావన లేనిది, కరుణ హరిభక్తిలేనిది, అద్వైత జ్ఞానం లేనిది, వేద శాస్త్రాలపై నమ్మకం లేనిది రామ కృష్ణులపై భక్తిధ్యాసలేనిదియైన జీవితం నిరుపయోగం అని జ్ఞానదేవుడు పదే పదే చెప్పాడు.

ఇరువది సంవత్సరాలు నిండకుండానే గొప్ప విరాగి, జ్ఞానియైన ఈ సంత్ కవిత్వం భక్తి ఊరుతూ నాస్తికులను కూడా ఆస్తికులను చేసేట్లు ఉంటుంది. యముని నీడలో మృత్యువు ఏక్షణంలో కబళిస్తుందో తెలియని అనిశ్చిత జీవితాలు గడిపే మానవులు, కుల, జాతి, మత భేదాలు పాటిస్తూ, ఉపనిషత్తులను విస్మరించి మాయామయమైన జీవితం గడిపే నరులకు భక్తి ప్రబోధించే ఈ అభంగాలు వెలలేనివి.

రెండు పదులు దాటుతుండగానే జ్ఞానబోధకే తన జీవితాన్ని అంకితం చేసిన ఈ 'సంత్' ఇంద్రయాణి నదీ తీరంలో తన అనుయాయులు అభిమానులు చూస్తుండగా నదిలోనే జీవసమాధియైన ఈ



మహానుభావుని కవిత్వం లలితమే గాక హరిభక్తి చిందేట్లు ఉంటుంది. మరాఠీ భాషలో ఆయన చెప్పిన అభంగాలు మహారాష్ట్రలో గొప్ప ప్రాచుర్యం పొందాయి. 27 అభంగాలున్న ఈయన 'హరిపాఠ్. ఆంధ్రీకరించి చక్కటి వ్యాఖ్యానం జతచేసి స్వామిసుందరచైతన్యానంద పుస్తక రూపంలో ప్రచురించారు.

ఆయన కవిత్వం ఉత్తుంగాలు లేని నిర్మల జలప్రవాహంలా ఉంటుంది. సరళమైన తెలుగులో చెప్పదలుచుకున్నది సూటిగా చెప్పే సుందరచైతన్య కవిత్వం హృద్యంగా ఉండి నామిత్రులు మూర్తిగారు చదివి వినిపించినప్పుడు ప్రథమ పరిచయంలోనే నన్నాకర్షించాయి ఈ అభంగాలు. భగవద్దత్తమైన శక్తితో నేను నా భావాలను పద్య రూపంగా మార్చగలను. వృత్తిరీత్యా ఇంజనీరునై, పక్షవాత పీడితుడనై, నా ఎదుట ఉన్నవన్నీ తెల్లరంగు వేసిన కారునలుపు రంగు వస్తువులని, శ్రీహరితప్ప బంధువెవరూ లేరని గ్రహించాను.



భక్తతుకారాం, నామదేవుడు ఏకనాథుడు వంటి సత్పురుషులే కాక సక్కుబాయి, మొల్లమాంబ, మీరా వంటి నారీ శిరోమణులు కూడ ఆ శ్రీహరి ప్రీతిపాత్రులయ్యారు, అవుతున్నారు, ఇకముందు అవుతారు. శ్రీహరిని వదలకండి. మనం అందరం లైనులో నిలబడ్డాం. కానీ ఆ నల్లనయ్యకి ఏ లైనుతో పనిలేదు. తన కరుణామృతం వడ్డిస్తూనే వుంటాడు. నీ వంతు ఎప్పుడో ఆ శ్రీమన్నారాయణునకే తెలుసు. మధ్యలో దారితప్పితే మళ్ళీ మొదలే.

నేను అడిగిన వెంటనే 'హరినామం సరిలేని ధామం' అని ఉపోద్ఘాతం వ్రాసిచ్చిన నామిత్రులు శ్రీ యం.వి.యల్. యన్.మూర్తిగారికి కృతజ్ఞతా పూర్వక నమోవాకములు. హరి నిరంతర కరుణాఝరి వారిపై కురియుగాక!